ఓం

శ్రీ కాశీ విశ్వేశ్వరాయనమః



# శ్రీ కాశీ విశ్వేశ్వర శతకము

గ్రంథకర్త:

వంగల వెంకటరత్నము

రిటైర్డు ఉపాధ్యాయులు

పాలమూరు, పశ్చిమ గోదావరి జిల్లా.

A. G. Press Bezwada.

ఓం

శ్రీ కాశీవిశ్వేశ్వరాయనమః

# శ్రీ కాశీవిశ్వేశ్వర శతకము

గ్రంథకర్త:

వంగల వెంకటరత్నము, రిటైర్డు ఉపాధ్యాయులు,

పాలమూరు, పశ్చిమగోదావరిజిల్లా.

ఈ గ్రంథము పాలమూరు వాస్తవ్యులు మహారాజశ్రీ

పండిత కలిదిండి నరసింహరాజుగారిచే పరిష్కరింపబడినది.

N. B. ప్రధాన రాజపోషక, రాజపోషక, పోషక సహాయ చందాదారులకెల్ల 5,4 3, 2, 1 గా గ్రంథములు ఉచితము. అట్టి పుణ్యాత్ముల నామములు గ్రంథమందచ్చొత్తింపబడినవి.

మొదటి కూర్పు
1000 ప్రతులు

ఆంధ్ర గ్రంథాలయ ముద్రాక్షరశాల
బెజవాడ
1940

వెల అంచ కూలిగాక
రెండు అణాలు మాత్రము

# పీ ఠి క

శ్రీమత్పరాత్పరుని పరిపూర్ణానుగ్రహము వలన నే నీ గ్రంథము వ్రాయఁగలిగితిని. నాకు యుపాధ్యాయపదవిలో పాఠశాలలయందు బాలురకు ఉపయోగ మగునటుల ప్రశ్నోత్తర లోకవ్యవహారబోధిని యను చిన్ని గ్రంథము వ్రాయఁగలిగితిని. 1934 సంవత్సరములో కులాంగన యను పద్యకావ్యము వ్రాసితిని. నే నంతటి పాండిత్యము గలవాడను గాకపోయినను నా విద్యాభ్యాసములో ఉచితముగా 5 వ తరగతి వరకు విద్య నేర్పి, నా ఉపాధ్యాయ పదవికి సహాయపడి నన్ను అభివృద్ధిలోనికి తీసుకొని వచ్చిన ఇక్కడ పాఠశాలలో ప్రధానోపాధ్యాయులుగా పని చేసి ఇటీవల దివికేగిన శ్రీ పెన్మెత్స రామచంద్రరాజుగారి అనుగ్రహమువలన పత్రికలకు వ్యాసములు వ్రాయుటకు తగిన జ్ఞానము సంపాదింపఁ గలిగియుంటిని. తదుపరి ఇక్కడ వాస్తవ్యులు బ్రహ్మశ్రీ ప్రయాగ గురునాధశాస్త్రిగారి యొద్ద కావ్యములు స్వల్పకాలము చదివి కొంత భాషాజ్ఞానము సంపాదింపఁ గలిగితిని. గ్రంథ పరిచయ

ము వల్లనే నాకీ కవితాధోరణి యలవడి పద్యములు వ్రాయుట ప్రారంభింపగా పాలమూరు వాస్తవ్యులును, క్షత్రియ కులోద్భవులును, దేవబ్రాహ్మణ భక్తిపూర్ణులును, ఆయురారోగ్యైశ్వర్యాభివృద్ధి, పుత్రపౌత్రాభివృద్ధి కలిగి సంపన్నులై యుండిన మహారాజశ్రీ కలిదిండి శివరామరాజుగారు, నేను వ్రాసిన 'కులాంగన' గ్రంథమునకు ప్రధాన రాజపోషకులుగా నుండి నన్నీ కవితాధోరణికి ప్రోత్సహించుటచే ఇప్పుడీ కాశీవిశ్వేశ్వరశతకము గూడ వారి ప్రధానరాజపోషకత్వమును గోరుచు వ్రాయగలిగితిని. ఈ గ్రంథముద్రణకు సహాయపడిన ప్రధాన రాజపోషక, రాజపోషక, పోషక, సహాయ, చందాదారులకు నా కృతజ్ఞతను దెలుపుచున్నాను. ఇందలి గుణదోషములు దెలిపినచో రెండవకూర్పున సవరింతును. ఈ గ్రంథము వ్రాయుటలోఁ దోడ్పడిన శ్రీమాన్ వాడపల్లి నారాయణాచార్యులుగారికి నా కృతజ్ఞతఁ దెలుపుచున్నాను.

పాలమూరు. }

ఇట్లు, గ్రంథకర్త,
వంగల వెంకటరత్నము.

శ్రీరస్తు.

# శ్రీ కాశి విశ్వేశ్వర శతకము.

శా. శ్రీయుగ్భవ్య కృపాసముద్ర! వరదా! క్షేమంకరా! సేవక
న్యాయాలోకన సన్మనోరథ మహాష్టైశ్వర్య సంధాయకా!
శ్రీయోదాయక మంగళాహ్వాయ విభాసీ! సచ్చిదానంద మూ
ర్తీ! యా కాశిపురీనివాస! సుఖదా! శ్రీకాశి విశ్వేశ్వరా. 1

శా. శ్రీమత్కోటి పతఙ్గమండల సమశ్రీభాస్వరా! యీశ్వరా!
కామోద్రేక వినాశకారణ వివేకభ్రాజితా! పూజితా!
ధీమద్బృంద వికారశూన్య సుఖదా! దేవా! స్వయంవ్యక్త మూ
ర్తీ! మోదప్రద! దేవదేవవినుతా! శ్రీకాశి విశ్వేశ్వరా. 2

శా. ఎవ్వాం డక్షయుఁ డప్రమేయుఁడు త్రిలోకేశుండు సర్వాత్మకుం
డెవ్వాం డా నిరవగ్రహుండు సకలాభీష్టార్థ సంధాయకుం
డెవ్వాం డాశ్రిత వత్సలుండు వెలిలో నెవ్వాండు నెల్గాండు నే
నవ్వానిన్ నినుఁ గొల్వనెంచితిని దేవా! కాశి విశ్వేశ్వరా. 3

శా. ఈ నా యాయువు చాలునే సకల లోకేశా! భవత్సృష్టిలో
నానాచిత్ర మహీజముల్ లతలు నానావర్ణ ధాత్వావళుల్
నానాచర్యలు సేయు సత్త్వములు నానావస్తువుల్ పేర్కొనన్
హా! నీ చాతురి యద్భుతావహము దేవా! కాశి విశ్వేశ్వరా. 4

శా. ఎవ్వాం డబ్జభవాండ కాండములఁ దా నేపార సృష్టించునో
యెవ్వాం డాద్యవసాన శూన్యుఁడయి యెంతే వాని రక్షించునో
యెవ్వాం డద్భుతలీల విశ్వవిలయాపేక్షన్ విరాజిల్లునో
యవ్వాని న్నిను నే భజించెదను దేవా! కాశి విశ్వేశ్వరా. 5

మ. భవదీయాంఘ్రియుగంబు దిక్కనుచు సంభావించి నిక్కంబుగా
భవదాఖ్యాస్మరణైక చింతనముచేఁ బ్రార్థించు కారుణ్యదృ
గ్విభవమే పాపును నాదు పాప మని తల్లాభంబు నాకెప్డు సం
భవమౌనో యని యిట్లు వేఁడెద మహాత్మా! కాశి విశ్వేశ్వరా. 6

మ. విజనస్థానముఁ జేరి మౌని వలె జీవింపంగ జాలన్ భువిన్
నిజసామర్థ్యముచే నొనర్తుఁ బనులన్ నీడంబునన్ వెల్గుకై
గిజిగాఁడుంచు మిడుంగురుం బురువు భంగిన్ నా మదిన్ సర్వదా
నిజమౌ భక్తిని నిల్పుకొంటి నిక తండ్రీ! కాశివిశ్వేశ్వరా. 7

మ. కరుణన్ నే తరుణంబునందుఁ బడయంగా గోర్కెమీఱంగ నా
కరణంబుల్ గరణంబు లన్ని వినియోగం బొప్పఁగాఁజేసి నీ
చరణంబుల్ శరణంబుగాఁ దలఁచి హర్షంబొంది గావింతు నీ
స్మరణంబున్ మరణంబు బొందువర కీశా! కాశి విశ్వేశ్వరా. 8

మ. స్ఫురితాదర్శ రవిప్రభాకలనఁ దజ్ఞుల్ లోతుకూపంబులో
వరహారచ్యుత మౌక్తిక ప్రకరముల్ భావించునట్లే చరా
చరవర్గస్థభవన్మహత్త్వముల తత్సంపూర్ణ సుజ్ఞాన సం
భరిత స్వాంతంబుచేతఁ జూచెద మహాత్మా! కాశివిశ్వేశ్వరా. 9

మ. భువిలో గ్రంథములెల్లఁ గర్తలబలంబుల్ దెల్పు ధీ పూర్ణస
త్కవిబృందంబు మదద్భుతావహ భవద్ధాత్రీ మహాగ్రంథమే
కవితాపాండితికి న్నిదర్శనముగాఁ గైకొంటచేఁ దెల్పు నీ
యవనీగ్రంథము నీ ప్రవీణత మహాత్మా! కాశివిశ్వేశ్వరా. 10

శా. లాలిత్యంబును సౌరభంపు పువులన్ లావణ్య దివ్యచ్ఛవుల్
ప్రాలేయాంశునియందు వజ్రముల ధావళ్యస్ఫురత్కాంతులున్
వేలున్ వన్నెలు పక్షులందు నిటు లీ విశ్వంబులోఁ బ్రజ్ఞలన్
లీలన్ గల్పనఁజేసి చూపుదువు తండ్రీ! కాశివిశ్వేశ్వరా. 11

మ. ప్రత్యక్షంబుగఁ జూచువానివలె మర్త్యశ్రేణి కార్యప్రజం
బత్యంతంబును నీ వెఱింగి తుది సౌఖ్యంబో మహాకష్టమో
సత్యప్రౌఢిని వారి కిచ్చెదు నినున్ సద్భక్తి నీక్షింపఁగా
నత్యధ్యక్ష మహాప్రభావము గదయ్యా! కాశివిశ్వేశ్వరా. 12

మ. పటమం దద్దిన యభ్రకంపుపొడి దీపప్రాంతమం దెట్టులో
యటులే యాకసమందు సద్గ్రహము లత్యంతప్రభన్ వెల్గి ప్ర
స్ఫుటమౌన ట్లొనరించు తావకలసజ్జ్యోతిర్మయాకారమున్
బటుయోగంబున మౌని గాంచు గద దేవా! కాశివిశ్వేశ్వరా. 13

శా. భావాతీత! మహానుభావ! విభవా! భద్రాత్మకా! రక్షకా
దేవా! నిర్మల! నిత్య! వేదవినుతా! దీనావనా! పావనా!
కైవల్యప్రద! శాంబరీ భ్రమితలోకవ్రాతనిర్మాణ క
ర్తా! విశ్వేశ్వర! నిర్వికార! మునివంద్యా! కాశివిశ్వేశ్వరా. 14

మ. అరయన్ గాలిపటంబు పై నిలువఁ దారాధార మౌనట్లు నీ
కరుణా వీక్షణమే నిదానము భవాగ్రిం బేను పొందంగ నేఁ
కర మాస్థానముగాన నీ వెటులు న న్నాపాదుదో నీదుని
ర్భర వాత్సల్యగుణంబె యాదరువు దేవా ! కాశివిశ్వేశ్వరా. 15

మ. గిరికెక్కించు మహోపలంబు బలె గల్గించెన్ ప్రియాసంబు నీ
నరజన్మన్ బడయంగ పాతకమె యెన్నన్ జాల సౌకర్యమౌ
కరుణన్ జూపకయున్నఁ గ్రిందఁబడుదున్ గష్టంబు వ్యర్థంబు నీ
వరిలెన్ జూపుచు మేలొసంగుము మహాత్మా? కాశివిశ్వేశ్వరా. 16

మ.. భువి న్యాయాధిపు ముందు దోషి తన తప్పుల్ సెప్పఁగా సాహసం
బవలంబింపఁడు భీతిఁ జూపిన నిఁకే యత్నంబులన్ జేసినన్
భవదీయాజ్ఞ యదేమొ నీ వశుగకే త్వద్దర్శనం బొందకే
యవలీలన్ దనతప్పుఁ జెప్పుకొను దేవా? కాశివిశ్వేశ్వరా. 17

మ. జగతిన్ గొంగళిపుర్వు చిల్కగుట వేసంగిన్ భువిన్ బడ్డయూ
డుగు గింజల్ రసితంబువిన్నఁ దమచెట్టేల్ సేకుటల్ రావికెం
జిగురన్ బుట్టుట తామ్ర మిట్టివి భవచ్చిత్రంబు లాలింపమా
దగు స్వల్పాయువు చాలునే వినుతిపాత్రా కాశివిశ్వేశ్వరా. 18

మ. యమివంద్యా పదునాల్గులోకములు మేలంతస్థులై యొప్పు సౌ
ధములోనుంచి చరాచరంబులను చిత్రంబుల్ సదాకాలమా
నము సూర్యేంద్రులు దెల్ప సందు నెపుడుం సంచారముం జేసి మో
దము నీవొందుచునుందు వయ్య పరమాత్మా కాశివిశ్వేశ్వరా. 19

మ. సత్యంబింతయుఁ గాదు లోకమనుచుం సౌఖ్యప్రద బ్రహ్మమే
సత్యంబంచు విశేష సానుభవ సుజ్ఞానంబు సంప్రాప్తమై
యత్యంత ప్రమదాబ్ధి మున్గువఱ కాహా యెంచెదర్ వేద సం
స్తుత్యా? వేఱుగనుంటి వీ వెటనో యంచుం కాశివిశ్వేశ్వరా. 20

మ. ధుని ప్రావృట్టునఁ బొంగుచున్ దపమునందున్ గ్రుంగు నా రీతిఁ బొం
దును మర్త్యుండు సుఖంబు భాగ్యము వెసన్ దుఃఖంబు దైన్యంబుగా
వున నివ్వానికి మోదఖేదములనున్ బొందంగ వ్యర్థంబగున్
నిన్నుఁ జేరన్ గనువాఁడె ధన్యుఁడగు తండ్రీ కాశివిశ్వేశ్వరా. 21

మ. నిను నానాంతరయామి యందు)గద నా నెమ్మేను నీయిల్లుఁగా
ఘనభక్తి న్నిరతాభిషేక జలముంగా నంతరంగంబు పా
వనయుష్మత్పద పూజ కంబుజముఁగా వాంఛింతుఁ జేయుంగ గు
ళ్ళును నీళ్ళున్ బువు లేల వేయుగ దయాళూ! కాశివిశ్వేశ్వరా. 22

మ. పరిశోధింపక బూచి బూచి యనఁగా బాలుండు బెగ్గిల్లు నా
దిరిగా నారకలోక మున్న దన భీతిన్ గుందెదన్ లేని చో
సరియే ఉన్నను దాని బాధ తొలఁగన్ శాసించి రక్షించి నా
యరవాయిన్ దొలఁగించి ధైర్య మిడు దేవా కాశివిశ్వేశ్వరా. 23

మ. నికటంబందలి దండనోపకరణానీకంబు గన్గొన్న దో
షికి బోలెన్ గ్రిమికీటకాములను వీక్షింపన్ భయంబౌను పా
తకి నే నెట్టి భవంబుఁ బొందగను నన్ దండింతువో స్వామి నే
నకముం బొందకయుండఁ బాపు మఘ మీశా కాశివిశ్వేశ్వరా. 24

మ. ఒకరుం జేద్చును వేఱొకండు నగు నిక్కొక్కండు ధ్యానించు వే
ఱొకఁడున్ బాపముసేయు నింకొకఁడు సేయున్ బుణ్యమున్ గొన్ని నా
ళ్ళకు నన్యోన్యము మార్పులున్ జరుగు నాహ్లాదంబు నీకైన పె
త్తిక మాకున్ దిరమెందు లేక భయ మీశా కాశివిశ్వేశ్వరా. 25

మ. స్థిరమున్ గాని వికారరూపములనున్ జీమూత మెట్లో యటుల్
నరుఁడొందున్ సుఖదుఃఖముల్ సుఖముస్వప్నప్రాయమౌ దుఃఖమే
వార మేకక్షణమే కనంబడు యుగంబై ఘోరమై నిల్వలే
ము రహిన్ దుఃఖము కల్గనీయకు స్వయంభూ కాశివిశ్వేశ్వరా. 26

మ. కొక్కు న్నొక్కఁగ బిల్లి వేఁచుగతి న న్గూల్పంగఁ బొంచుండియుం
టక్కుల్ సేయుచు మృత్యువున్న దిటు లుంటన్ జిక్కఁబొ నెప్డొ నే
నక్కైవల్యపదంబుఁ బొందఁదగి యెమ్మైపోదునో యంచు నేఁ
బొక్కంజొచ్చితి మేలొసంగుము స్వయంభూ కాశివిశ్వేశ్వరా. 27

మ. అతుకన్ బంగరు బంగరున్ నడుమ మేలౌ టంకమే ముఖ్యమౌ
గతి భిన్నంబగు నాత్మయాత్మ గలయంగా భక్తియే కావలెన్
జితవైరీ యనుతాపవహ్ని దరిదింపన్ వీలు సంధిల్లగా
నెతఱిన్ దప్పక చేర్పఁ జూడవలెఁ దండ్రీ కాశివిశ్వేశ్వరా. 28

మ. అకటా! ఒక్కక్షణంబు నమ్మనట కనర్హంబౌచుఁ దానట్టులుం
డక ప్రాణంబమృతాది వస్తువులు కన్నన్ దీప్తియై యుంటఁ ద
ప్పక యెన్నేమి ఘటిల్లునో పిదప నే పాల్గొందునో యంచుఁ జిం
తకు లోనైతిని యెట్లు లోముదో మహాత్మా! కాశివిశ్వేశ్వరా. 29

శా. ఆకారాది వికారశూన్య నిఖిల వ్యాపార వైజ్ఞానికా
శ్రీకల్యాణగుణ ప్రపూరితమతీ చిద్రూప యాద్యంత శూ
న్యా కారుణ్యమయా సుభక్తజన చిత్తాంభోజ సూర్యోదయా
లోకారాధ్య పురాణపూరుష కృపాళూ కాశివిశ్వేశ్వరా. 30

మ. వరి ఘోరాతపమొంది కందునపుడున్ వర్షంబు ప్రాప్తించు న
ట్లరయన్ దుష్టుడ దుష్కృతోద్భవుఁడ దుష్టాత్ముండనై చాలఁగాఁ
బరితాపంబును బొందుచుండ నెటులో ప్రాప్తించె నా కిప్డు నీ
చరణధ్యానము తాపమున్ దొలఁగ నీశా కాశివిశ్వేశ్వరా. 31

మ. సకలానందకరైక పంచమ వరస్వానంబుఁ గావించుచోఁ
బికపోతంబును వాకులం బ్లటులు నీపేరెత్తినన్ జిత్తమున్
సకలోర్వీ విషయాళి బాధలిడి మాన్పం జూచుచుండంగ నె
ట్లకటా! నిన్ను భజింతు నేమిగతి దేవా కాశివిశ్వేశ్వరా. 32

శా. దీపంబుఁ గని భక్ష్యమా ననుచు భ్రాంతిం జెంది పై వ్రాలునే
నా పుర్వంబలె రుచ్యవస్తువుల కై యాసల్ మదీయాత్మఁ బ్రే
రేపింపఁ బడుచుండు బాధఁ గని తండ్రీ నీ వుపేక్షించినన్
గాపాడంగల వార మెవ్వరిది యింకన్ కాశివిశ్వేశ్వరా. 33

మ. పసివాఁ డాటకు దూరమేగి తన త్రోవన్ దప్పుటన్ వెండియున్
వసతిన్ జేరఁగ శక్తి లేక కడుక్షోభల్ పొందు చందంబునన్
వసుధన్ నీయెడ వీడి సేరి మగుడ న్మార్గంబుఁ గన్పట్టలే
నసమర్థుండను దారిచూపు దయ దేవా! కాశివిశ్వేశ్వరా. 34

మ. వికిరంబుల్ వలక్రింది ధాన్యములనున్ వీక్షించి కాలూని వం
తకు లోనౌ గతి పాపకార్యములనున్ దత్కాలసౌఖ్యంబు నెం
చుక సాగించుచుఁ జిక్కుఁ లోబడుదునంచున్ వేడుచున్నా నహో
యకలంకా యఘబుద్ధిఁ దూల్పవలె సుమ్మా! కాశివిశ్వేశ్వరా. 53

మ. జనకుం డిచ్చిన సొమ్ము జూదమున వెచ్చంబెట్టి తేలేక లే
మిని క్షోభించెడు జూదరింబలెను నా మేల్నీవు వాంఛించి యి
చ్చిన సుజ్ఞానము సంసృతిన్ బోనుపుచున్ జింతిల్లెదన్ దప్పు దం
డన కర్హుండను, సైపవే కనికరానన్ కాశివిశ్వేశ్వరా. 36

మ. తనదౌ భూరిధనంబు వంచకుని చేతంబెట్టు మూర్ఖుంబలెన్
ఘనమౌ నాయువు సంసృతిన్ బోనుపుచున్ గైవీడి గీపెట్టుచుం
టిని గానన్ స్వకృతాపరాధ మిది తండ్రీ సైచి ముందింక స
ద్వినియుక్తాయుసిగా నొనర్పుము కృపాబ్ధీ కాశివిశ్వేశ్వరా. 37

శా. న్యాయంబున్ గనువాఁడవై శరణటన్నన్ పక్షికిం జేరి బల్
సాయంబై నిలుతంచు నెంచి సుమతిన్ శంభో మహాదేవశం
భో యం చాపదలందుఁ గావుమని మొఱ్ఱోయన్న నాలింపవా
హా యార్తుండను జేరఁదీసికొనవయ్యా కాశివిశ్వేశ్వరా. 38

మ. అరయంగా నెఱయుంచి గాలమున మత్స్యశ్రేణి రప్పించు జా
లరివోలెన్ బరవిత్తకాంతలను లీలన్ మచ్చుగాఁ బెట్టి మా
యురవుల్ దప్పఁగఁ జేసి యాస మము నెంతే బాధఁ బొందించుగా
న రహిన్ దృష్ణకు లొంగనీయకు మనంతా! కాశివిశ్వేశ్వరా. 39

శా. నీతోఁ గాలము తిన్నగాఁ గడుపుటల్ నీతోనె సల్లాపముల్
నీతో నా సుఖ దుఃఖముల్ దెలుపుటల్ నీతో వినోదించుటల్
నీతో నాటలు పాటలున్ బలుకులున్ వేయేల నా సర్వమున్
నీతోనున్నది నీవె దిక్కగుటఁ దండ్రీ! గాశివిశ్వేశ్వరా. 40

శా. నా దోషంబులు రోగరూపముగ నన్బాధించుచుండంగ మ
ద్బాధల్ సూచి యుపేక్ష సేసెదవు పాపధ్వంసివై క్రోధమో
మోదంబో మఱపో యెఱుంగవొ ననున్ మొఱ్ఱల్ చెవిన్ సోకవో
యేదీ పుత్రునియందు నీ కరుణ తండ్రీ! కాశివిశ్వేశ్వరా. 41

మ. అరయంగాఁ బతితుఁడ బవిత్రునిగఁ జేయంజాలు దీ వంచు నీ
చరణద్వంద్వముఁ జుట్టుకొంటిని సుమీ స్వామీ దయన్ గావవే
దురితాత్ముండ నటంచుఁ గొట్టకుము నన్ దూరంబుగాఁ బావనా
యరిదిన్ నన్నని బ్రోవుబ్రోవు పరమాత్మా! కాశివిశ్వేశ్వరా. 42

మ. అవనీనాటక సూత్రధార యిపుడీ యంకంబునం దేమి హే
తువొ యన్యాయము వృద్ధియయ్యె నపమృత్యుల్ పెక్కులై యుండెదీ
ని విలోకింపఁగ గుండె ఝల్లుమనుచుండెన్ ఘోర మీయంకమున్
సవరింపన్వలె నెవ్వఁడోపును మహేశా! కాశి విశ్వేశ్వరా. 43

మ. బస లర్థ్యమ్ములు సేయు సత్రమని జెప్పంజాలు విశ్వంబులో
అసువుల్ స్థైర్యము కల్గకుండ మము వేసార్లిట్లు పుట్టించుచున్
వెస గిట్టింపుచు నిట్టు లాడెదవుగా వేధింప మోదంబొకో
విసుగున్ బొందవె ముక్తినిమ్ము కరుణాబ్ధీ కాశి విశ్వేశ్వరా. 44

మ. మతి నిశ్చింతను గొల్చుచుంటి పరమాత్మా దిక్కు లే దింక నన్
వెతలం బెట్టకు నాదు మొఱ్ఱవినుచుం బ్రేమించి నాపైని సం
తతముం జేయిడి యోడకుండు మని యోదార్పం బ్రియత్నించి భ
వ్యతరానుగ్రహ ముంచి బ్రోచుకొనవయ్యా కాశి విశ్వేశ్వరా. 45

శా. ఏ రూపంబున నేమి సేయుచును నీ వే మూల నున్నావురా
ఏరా నా మొఱ వీనులం జొఱదొ నీ కిష్టంబు లేదో వినం
భారంబంచుఁ దలంచితో కొంకి విని సద్భక్తిం నినుం గొల్చెదం
నేరంబుల్ క్షమియించి బ్రోవు మిఁక తండ్రీ కాశి విశ్వేశ్వరా. 46

శా. ఆలోకింపవె తాపముం బలుకవే యాలింపవే మొఱ్ఱలం
కాఁ క్రోధము నడ్డవే కరుణ నా కన్నీళ్ళు నీ వొత్తవే
కాలంబంతయుఁ దిన్నఁగా గడుపవే కాపాడవే చూడవే
జాలిం గైకొనవే నమస్కృతుల నీశా కాశి విశ్వేశ్వరా. 47

మ. ఉదయంబాదిగ నిద్రబోవువఱ కెన్నో యూహల్ జేష్టల్
మది నూహించెదఁ జేయుచుండెద మహాత్మా నీకు నిందేది ము
త్ప్రదమో యాగ్రహ కారణం బెదియొ నీ భక్తుం డెఱుంగండు గా
న దయన్ లోపము దిద్ది మేలిడు మఘఘ్నా కాశి విశ్వేశ్వరా. 48

మ. కరుణాబ్ధీ! యఘముల్ దలంచుకొనఁగా కన్నీరు మున్నీరుగాఁ
దొరలన్ జొచ్చును గుండె ఝల్లుమను నా దోషంబుల న్నెపు మో
హర! యంచున్ మొఱవెట్టుచుండినను నీ వాలింపవా పాప సం
హరుఁడంచున్ బిరుదుండె సార్థకము కాదా! కాశి విశ్వేశ్వరా. 49

మ. ఇలఁబుట్టించి ముదంబుతోఁ బెనుచు చెంతే ప్రేమతోఁ జూచు నన్
గలుషవ్యాధులు సెందునప్పు డవి మాన్పన్ జాలి వీక్షింతువా!
కలితామోదముతోడఁ బెంచుకొను చిల్కన్ ఘోర మార్జాల దం
ష్ట్రల పాల్సేయఁగ నెవ్వఁడొప్పును మహేశా కాశి విశ్వేశ్వరా. 50

మ. వెనుకన్ జేసిన పాపకృత్యములు జ్ఞప్తిన్ జొచ్చి బాధింపఁగా
నను తాపంబును బొంది చిత్తమున నిన్ ధ్యానించుచున్న న్సదా
నినుఁ గాదన్నటు లూఱకుండెదవు తండ్రీ బిడ్డతోఁ బంతగిం
చిన నే చెర్వ్యాజలంబు త్రాగి మనుదున్ శ్రీకాశివిశ్వేశ్వరా. 51

మ. కడుపాట్లంబడి నీ దయన్ నొ్మనయఁగాఁ గాంక్షించుచు న్నిత్యమున్
బడిగాపుల్ పడి వేచియుండిన కృపాపారీణ నాపైని చో
ప్పడు కారుణ్యముఁ జూప వేమిగతి కోపంబేల దీనుండ నా
యెడఁ గోర్కెల్ సమకూర్చి గోడుడుపు తండ్రీ కాశివిశ్వేశ్వరా. 52

మ. అనలస్పర్శను పేరుకొన్న నెయి తా నాద్రావకంబట్లు నా
యనుతాపాగ్నినిఁ జిత్తము న్కరిగి పీలై యుండెనో కల్మషం
బును దూల్పన్ వడబోయుమయ్య సమయంబున్ దప్పినన్ట్లైన వే
దను దా వెండి ఘనీభవించుఁ బరమాత్మా కాశివిశ్వేశ్వరా. 53

మ. నను నీ వానిని బాగుసేయ నభిమానంబైన లేదయ్యెఁగా
నినునేఁ గొల్వఁగవచ్చునే పరుఁడు నన్ బ్రేమించి రక్షింపఁ జెం
తను నన్ జేర్తువటంచుఁ గొల్వఁ బరువెత్తన్ ధర్మమే నీదు పా
దనఖంబే మది కందకుండెఁ బరమాత్మా కాశివిశ్వేశ్వరా. 54

మ. వరభక్తాఘమహాటవీదవశుచి జ్వాలల్ మహాపత్తమో
హరణాదిత్య వినిర్మలద్యుతులు దైన్యవ్యాధి సిద్ధౌషధో
త్కరముల్ జన్మపరంపరాతరులతాకౌక్షేయకంబుల్ భవత్
కరుణాపూరిత దృగ్విలాసము లఘఘ్నా కాశివిశ్వేశ్వరా. 55

శా. సూరుండబ్ధినిఁ గొన్నతోయమున కిచ్చుం గోటిరెట్లట్టు లే
వారామోదముతో భవద్విషయ సత్పాత్రక్రియాఘంబు నం
దే రిక్థంబును వెచ్చఁబెట్టుదురొ తండ్రీ నీ వగణ్యంబుగా
వారా సొమ్మునుఁ జెందఁజూచెదవు దేవా కాశివిశ్వేశ్వరా. 56

మ. తనయుం డేమియుఁ గోరకుండినను వాత్సల్యంబుతో వేళనుఁ
గని సర్వంబిడి బ్రోచు తల్లివలె భక్తశ్రేణి వాంఛింపకుం
డిన నే వేళకు నేదికావలెనొ దానిం జేర్చి గాపాడెదా
నిను సేవింపఁడె వెఱ్ఱివాఁడయినఁ దండ్రీ కాశివిశ్వేశ్వరా. 57

మ. దూడంబాయని యూర్పుచే జనని కెంతో ప్రీతిఁ జూపించు చా
జాడంబోయెడు గోవుచందమున నిన్సద్భక్తితోఁ గొల్చు చే
వాఁడెల్లేగిన నట్లుపోయెదు మహావాత్సల్యమున్ జూపుచుఁ
దోడై ప్రేముడి యెంతొ సేవకులయందుఁ కాశివిశ్వేశ్వరా. 58

శా. ఆపద్బాంధవ దీనమానవశరణ్యా ముక్తిసంధాయకా
పాపవ్రాత వినాశకృత్య నిపుణా బ్రహ్మాండ కోటీశ్వరా
యో పారత్రిక నిర్వికార సుఖదా యో సచ్చిదానందమూ
ర్తీ పాదాశ్రిత భక్తకోటివరదా శ్రీకాశివిశ్వేశ్వరా. 59

మ. దళమై గ్రీష్మ హిమంబు వీడినగతిఁ దప్పెన్ మహాపత్తులున్
బలుమేళ్ళున్ గలిగెఁ ఖలుల్ సెఱుప సంభావించిన న్నీనికిఁ
దలఁప న్నా జతనంబు లేమిని భవత్కారుణ్యమే హేతు వి
ట్టులు నన్గాచెడు నిన్ను నే మఱతు నెట్టుల్ గాశివిశ్వేశ్వరా. 60

మ. ఎదియో నేర్చి పసిండిలోఁగసటు వహ్నిం బెట్టి పోగొట్టు రీ
తిఁ దోలంపన్ మదఘంబున న్నిడుచు నార్తిన్ బై ప్రయోగింప నా
పదలన్ దూఱితి నిన్ను నప్పటిస్థితిన్ బల్గాకిన్నై శాంతిబొం
ది దయన్ దీనుని నన్ను సైపు మఘభేదీ కాశివిశ్వేశ్వరా. 61

మ. తలపఁ నీ వొనరించు మేలులకు నంతంబున్న దే నీరమున్
చెలమన్ దీసిన కొద్ది నూరెడుగతిన్ జిత్తంబునం దోఁచు నీ
కెలమిన్ బ్రత్యుపకార మేమి సలుప న్నే జాలుదుఁ నీ పదం
బుల ముద్దాడెదఁ దాల్తు నొదల ముదంబున్ కాశివిశ్వేశ్వరా. 62

శా. పిల్లల్ దల్లుల పెట్టుపోతల మహావిశ్వాసమున్ బూని వా
రిల్లోకంబున సంచరించుగతి నీ వే మిచ్చినన్ దాని నే
నుల్లాసంబున నమ్మి గైకొనుదు నింకో దేవ నీదే సుమీ
మల్లాభంబుఁ దలంచు భారము మహాత్మా! కాశివిశ్వేశ్వరా. 63

మ. ధనినైనన్ నిరుపేదనైనఁ గడు మోదంబొందినన్ ఖేదమొం
దినఁ బుణ్యాత్ముఁడనైనఁ బాపినయినన్ దీనావనా నీవె కా
రణ మూనంగను నాదుభారమును నిర్వాదంబు నీపైనిఁ ద
ప్పును నా కెప్పుడు మేలొసంగిన స్వయంభూ కాశివిశ్వేశ్వరా. 64

శా. లోకారాధ్య సుఖంబుచే మఱపుగల్గుం న్నా కటం చెంచకే
నీ కారుణ్యము నా పయిన్ గలుగ క్షోణిన్ బొందు సౌఖ్యంబుచే
నా కానందము వృద్ధిమైనకొలదిన్ బ్రార్థించుచున్నాను నూ
నీకే దీనినిజంబు గోచరము తండ్రీ కాశివిశ్వేశ్వరా. 65

శా. లాలిత్యాది భవద్విలాసముల లీలన్ జిహ్వ వర్ణింప నీ
వాలింగ్యుండ వటంచు నెంచి మతి తా నానందమున్ బొందుచున్
మేలందన్ నినుఁ బొందఁగోరెఁ జుమి మన్నింపన్ దయంజూడవే
యాలోకింపవె తాపమున్ సుజనవంద్యా కాశివిశ్వేశ్వరా. 66

మ. మలయోద్భూత మరుత్తుకన్న నవపద్మస్తోమ శృంగారశ
య్యల కన్నన్ ఘనసారసమ్మిళిత సమ్యగ్గంధ పాటీరచ
ర్చలకన్నన్ శశికాంతి కన్నను భవత్కించిత్కటాక్షుంబె శీ
తలమౌఁ గావునఁ దాపమార్పవె మహాత్మా! కాశివిశ్వేశ్వరా. 67

మ. రమణీయం బగు సౌధవాసములు సామ్రాజ్యాధికారంబు భో
జ్యములున్ హాటక భూషణంబులును స్త్రీ సంభోగ సౌభాగ్య సౌ
ఖ్యములున్నన్ మృగతృష్ణలో జలములై గాన్పింప సాన్నిధ్య సౌ
ఖ్యమునే భక్తుఁడు గోరుచుండుఁ బరమాత్మా! కాశివిశ్వేశ్వరా. 68

మ. నిను వీక్షించెడు జ్ఞాన నేత్రమును గన్పట్టంగలేకుండుటన్
నను నజ్ఞానము వెంటఁబెట్టుకొని సన్మార్గంబుఁ దప్పించుచుం
డెను దానిన్ దునుమాడు జ్ఞానమయ దృష్టిన్ నేను గన్పట్టు సా
ధనమున్ నా కుపదేశ మిమ్ము పరమాత్మా! కాశివిశ్వేశ్వరా. 69

మ. నగలన్ భోజ్యము లెన్నొ చోద్యముల నన్న పాత్రశ మందుంచు న
ట్లుగ లోకంబున ముక్తి మార్గములు వేలున్ ముందుగా బెట్టి యుం
డఁగ మే మెంచుదు మేదియో యొకటి యత్నంబందు స్వామీ బలం
బుగ నీ వుండిననే జయింతు నమృతంబున్ కాశివిశ్వేశ్వరా. 70

మ. చెలిమో తెల్వియొ ధర్మమో యనృతమో సిగ్గో తిరస్కారమో
కలహంబో కపటంబొ ధూర్తతనమో గర్వంబొ సత్యంబొ కా
శలమో గల్గెడు మాటలాడునెడలన్ సంస్తోత్ర పాత్రంబుగాఁ
బలుకన్ నాకు హితోపదేశ మిడు దేవా కాశివిశ్వేశ్వరా. 71

మ. అమలా కోరుదు నన్న వస్త్రగృహ భార్యా పుత్రులం దేది లో
పము దానిన్ దలయూచి నంతటనె సంప్రాప్తించు మా కన్ని స్వ
ల్పములా వీనికె యెంతో భక్తిం గనుపింపన్ లభ్యమా పొందగా
నమృతం బెంతటి భక్తి కావలెనో దేవా కాశివిశ్వేశ్వరా. 72

మ. నిరతం బేను పరోపకారములనున్ బ్రీతిన్ బ్రియత్నించుటల్
పరకష్టంబును స్వీయకష్టముగ సంభావించుచుంటల్ చరా
చరవర్గంబునం దుల్యభావమున సంచారంబు గావించుటల్
నిరతిన్ నీతులు నేర్పు పుత్రునకు తండ్రీ! కాశి విశ్వేశ్వరా. 73

మ. ధరణిన్ బేదల ధిక్కరించుటలు ప్రాప్తంబంద సంతుష్టియున్
బరసంపత్తుల కోర్వకుండుటలు దైవప్రార్థనల్ మానుటల్
పరకాంతామణిం గాంచి మోహపడుటల్ వర్జించి సన్నీతితో
దిరుగన్ బుద్ధులు సెప్పు పుత్రునకుం బ్రీతిన్ గాశి విశ్వేశ్వరా. 74

మ. తొలఁగెన్ నమ్మిక వేదశాస్త్రముల యందున్ దేశమందంతటన్
వెలసెన్ బూర్వము లేని యద్భుతమతాభిప్రాయముల్ శంకలున్
దలక్రిందై నది కాల మిట్టి తరి సత్యంబాత్మఁ దోపించి య
ట్టులె నన్నున్ నడిపించుచుండవలె నెప్డున్ కాశి విశ్వేశ్వరా. 75

మ. హరిసేవార్చిత తావకీనపదముల్ ప్రార్థించు చిత్తంబు దు
ర్భరకష్టాహి సువర్ణమై పరఁగు త్వత్ప్రాంచత్కటాక్షంబు సు
స్థిరమా నిశ్చలమా సుఖంబిడు భవద్దివ్యానుసంధాన మీ
శ్వర నేఁ బొందఁగఁ జూచుచుండవలె దేవా కాశి విశ్వేశ్వరా. 76

మ. తమ రోగంబులు మాన్పు మందులను పథ్యంబున్ రుజాగ్రస్తు లే
వముతోఁ జూచెడురీతిఁ బాపమును బాపంబోలు నీసేవ క
ష్టముగాఁ దోఁచెడుఁ బాపగోగికిని త్వత్సంసేవ సేయంగ ని
ష్టము సంధిల్లెడు మార్గమున్ దెలుపు మీశా కాశి విశ్వేశ్వరా. 77

శా. ఆవిర్భావ వివర్ధనాత్యయ విహీనా వేద సంస్తోత్రి సా
త్రాి వైరాగి సఖా నిరంజనవిచిత్రా త్ర్యక్ష దివ్యప్రభా
వా విశ్వేశ పరాత్పరా శుభద సర్వవ్యాపి సుజ్ఞాన భా
సీ వందారుజనామరక్షితిరుహా శ్రీకాశివిశ్వేశ్వరా. 78

మ. కలుషక్షీరము సుంతయౌ కతకపుంగంధంబునన్ స్వచ్ఛమై
వెలయున్ దద్విధి కల్మషామయ సమావేశంబు స్వాంతంబునన్
గలుపన్ దానిని దేర్చు తావకలసత్కారుణ్య దృగ్లేశమే
పలువం జెంచక చూడుమట్టు లొనరింపన్ కాశివిశ్వేశ్వరా. 79

మ. ప్రమిదెన్ మానవు లెట్లు తైలమిడి దీపంబుంతు రాలాగు దే
హమునం దాయువుఁ బోసియుంచితివి జీవాత్మన్ బ్రకాశింప వా
తముఖోపద్రవ కారణంబుల దురంతం బొందుటల్ గల్గు నో
యమలా యెట్టులు కాచియుండెదవొ దేవా కాశివిశ్వేశ్వరా. 80

శా. దీపౌఘు పృథకంబెఁ బూర్ణశశిదీప్తివ్యాప్తి హెచ్చైనటుల్
లోపాటంకము లుండు మర్త్యుల కృపాళుత్వంబుకంటెన్ ద్వదీ
యాపాంగేక్షణ మెందుసౌఖ్య మిదుచుం బాపాంధకారంబునుం
బాపుంగావున దానిఁ గోరెదను దేవా కాశివిశ్వేశ్వరా. 81

మ. అనయం బేను విశేషబాధకర కష్టారాతి సందోహ మ
ధ్యను నిల్వ న్నను నేన కాచికొన శక్యంబౌనె యిం కెట్టివే
శను నే బాధల వెట్లువచ్చినను దూల్పంజాలు భారంబు నా
దని వేగన్నులఁ జూచుచుండుము మహాత్మా కాశివిశ్వేశ్వరా. 82

మ. మతినిన్ భ్రాంతినిబెట్టు స్వప్నమును నమ్మంజేసెడు న్నిద్రి సం
సృతి నజ్ఞానము సేయునట్టులెగదా చిత్తభ్రిమల్ మాన్పజా
గ్రితయుం జ్ఞానముగాన సత్యమునె వేడ్కన్నన్ను నమ్మించుసం
తత సుజ్ఞానము నా కొసంగు మహితాత్మా! కాశివిశ్వేశ్వరా. 83

మ. సకలాంగంబులు తిన్నఁగాఁ గలిగి నే జన్మించితిన్ మధ్యనే
వికలాంగుల్ గను కొంద ఱాటఁగని లో భీతిల్లుచున్నాను తా
వక సంపూర్ణకటాక్షవీక్షణము నాపైఁ ద్రిప్పి యిప్డైన వీ
నికి నే లోపము గల్గనీయకుము తండ్రీ! కాశివిశ్వేశ్వరా. 84

మ. అభయం బన్నది లేక పేరిడఁగ శక్యంబే యెవండుర్విలో
విభవఖ్యాతి సుఖప్రభావములచే వెల్గొందునో వానికై
యభయం బయ్యెడు గాన నద్ది భువిలోన న్లేదు నీ యొద్దనే
యభయం బున్నది యిమ్ము భక్తులకు దేవా! కాశివిశ్వేశ్వరా. 85

మ. క్రియముంజేసెడు నీదు వస్తువులు మోక్షంబున్ సుఖంబు న్ననుం
గ్రియకుంగా నొనరింప త్వచ్చరణయుగ్మధ్యానము న్నా యవ
క్రియముల్ దెచ్చితిగాన దానిని మహార్యా చూచి గైకొంచుఁ ద
ద్వ్యయ మంది మ్మొసగంగ న్యాయ మగు నంతన్ కాశివిశ్వేశ్వరా.

మ. మనువందే చెడు గొప్ప డెట్లనుభవింపన్ వ్రాసియున్నావొ దా
నిని దిద్దింపఁగలేని కొల్వు వృథయా నీవే స్వతంత్రుండవా
టను దీర్ఘంపు నిరామయాయువును వేడ్కం బొంది నిశ్చింతతో
డను యాత్రన్ గడుపంగ దిద్దుము మహాత్మా! కాశివిశ్వేశ్వరా. 87

మ. నిను నేఁగొల్వ మదీయదోషగిరులన్ నీపూర్ణ కారుణ్య వా
ర్ధినిఁ గప్పించితి వందు చిత్రముఁగ బ్రీతిన్ బోవుచున్నాను తో
వను తత్పర్వతముల్ దగుల్కొనినచో భంగం బగున్ గాన వా
నిని నిర్మూలము చేయవే దయను తండ్రీ! కాశివిశ్వేశ్వరా. 88

మ. శ్రమచే తేనెను గూడబెట్టి సరఘుల్ సౌఖ్యంబు నాసించు చం
దమునన్ గూర్చితి నేను తావకపదధ్యానామృతంబైన లో
కము తేనెంబలె ధ్యానమున్ విషయముల్ గాంక్షింప వ్యర్థంబగున్
శ్రమ నేతత్ఫల మొంద తోడుపడు మీశా! కాశివిశ్వేశ్వరా. 89

శా. ఎన్నో వేషములం ధరించి తుదకే నీవేషముం దాల్చియుం
టి న్నేనింతకు మించు వేషమును తండ్రీ వేఁడుఁగా లేను బా
గున్నన్ మోదముఁబొంది కోర్కె నిక లేకున్నన్ దయన్ జెప్పుమా
పన్నాకారము లంద వద్దనుచు దేవా! కాశివిశ్వేశ్వరా. 90

మ. పడతుల్ గవ్వలనాడ గండములు తోరివన్ గల్ల నన్నింటినిన్
గడుపన్ బంటకు వచ్చు కాయవలె మోక్షంబొందఁగాఁ బాత్రమ
య్యెడు జన్మంబు ధరించితిన్ మొదటికే యేతేరఁ జొచ్చోటనే
యుడుమల్ సెందక పండునట్లు వర మిమ్మా! కాశివిశ్వేశ్వరా. 91

మ. శ్రితసంస్తూయ మహారాజ! భూర్యనుపమ జ్యోతిర్మయాకార శా
సితభక్తామితదోష సద్గుణవిభాసీ సర్వలోకాఘనం
తత సృష్టిస్థితి నాశకారణ మహానందాత్మకా విశ్వపూ
జిత పాదాంబురుహప్రకాశ వరదా శ్రీకాశివిశ్వేశ్వరా. 92

మ. మదిలో బుట్టెడు కోర్కె లుంచితి మహాత్మా యీశతం బందుఁ గో
విదు లింకెందఱినో వినంగవలె సన్విజ్ఞ ప్తులం బొంచి యో
సదయా తీరికలేకపోవు నని నే సందేహముం బొందుచుం
దుది నా వాంఛిత మొక్క-పద్యమునఁ గూర్తుం గాశివిశ్వేశ్వరా. 93

మ. ధర జీవించెడు నంతకాలము నినుం ధ్యానించు చిత్తంబునేఁ
బరులం యాచనసేయకుండ బ్రతుకుం పాపక్రియాభీతి సు
స్థిర నైసర్గిక సౌఖ్య ముండుట తుదిం దేవా యనాయాసమా
మరణంబుం గలిగింపఁగాఁ దలఁచుకొమ్మా కాశివిశ్వేశ్వరా. 94

మ. ఘనకాంతిన్ రవిచంద్రు లుండినను నక్షత్రంబు లత్యల్ప శో
భను రాజిల్లెడు రీతినిన్ గొలుచు దివ్యగ్రంథముల్ ధాత్రిఁ గ
ల్గిన నా యీ శతకంబుగూడఁ గడదై కీర్తించెడున్ బ్రీతితో
గని యాలింపుము భావము న్గను, మఘఘ్నా కాశివిశ్వేశ్వరా. 95

మ. కనులన్ ఱెప్పలు వోలె నీ వనయమున్ గాపాడు చున్నావు మ
మ్మనను, లేకున్న జరింప మా వశమె, యామోదంబుతో నొక్క చే
క్షణము నీ వొనరించు మేలునకు వేజన్మంబులం దైననున్
నిను నెట్టుల్ మరవంగ నేర్చుదుము తండ్రీ! కాశీవిశ్వేశ్వరా. 96

మ. అనయం బే ననయంబు బొందుచును సౌఖ్యం బేమి లేకున్న నా
పరిణయంబుల్, ప్రణయంబునన్ గొన, దయాభావంబుతోఁ జూచినా
యనయం బంత నయంబు సేయుచును, న్యాయాభీష్ట మీఁడేర్పని
న్ననయంబున్, వినయంబుతోఁ గొలుతు దేవా కాశీవిశ్వేశ్వరా. 97

మ. హర నీతో గిరి యంచు నా యవసరంబం దిప్పుడే మయ్యెనో
కరుణాంభోనిధి, యావగింజ నరభాగం బైన గాలేదు న
న్నరితి న్గావుము సర్వకాలముల సర్వావస్థలందు న్నిరం
తర మెందు న్విసు గొందకుండఁ బరమాత్మా కాశీవిశ్వేశ్వరా. 98

మ. మును నే మ్రొక్కిన మ్రొక్కుదీర్ప శతకంబున్ బూర్తి గావించితిన్
జననం బందినదాదిగా నిను మనస్సా సేవలన్ జేయుచున్
నిను నే నిత్యము సంస్మరించుదును తండ్రీ నీగుణాతీతతన్
మన మందున్ శుభదృష్టి జూతు సుఖధామా కాశివిశ్వేశ్వరా. 99

మ. ఘన చిత్తంబున నీ కొసంగితిని, నీ కారుణ్యము న్గోరి పా
వనుఁడార్యోత్తముఁడా ప్రయాగగురునాథాఖ్యార్య శిష్యుండ ను
ర్విని నే వంగల వారివంశజుడనై శ్రీ వేంకటారత్నమా
టను, నీవీ శతకంబు గైకొనుము, దేవా కాశివిశ్వేశ్వరా! 100

శా. శ్రీ వత్సాఖ్యసుగోత్రసంభవుడనై శ్రీ భాగ్యమే తల్లియై
సావంతుం డగు రామయాఖ్యుడును తండ్రై, యొప్పెచున్ నీదు సే
వావాత్సల్యత, జేసితిన్, శతక మాహ్లాదంబుతో జూచినన్
నా వాంఛితమ్ము తీర్పగా గదవె, దేవా, శ్రీకాశి విశ్వేశ్వరా. 101

సంపూర్ణము.

శ్రీ కాశీవిశ్వేశ్వరాయ నమః

# దండకము



శ్రీ మన్మహాదేవ దేవ దేవా, సర్వలోకాఘు, శ్రీ ముక్తి సంధాయకా, మహావైరభీమా, మహాభక్త కల్పద్రుమా, సచ్చిదానందమూర్తీ, మహానిర్మలా, నిశ్చలా, మహావిభ్రమాసక్తి ఖేల, ప్రీతితో శ్రద్ధతో, ప్రేమతో, నన్నాలించి రక్షించుతన్, నన్నునుంజేర్చి, నా తాప మిాక్షింపవే, భక్తి బోధింపవే, మొఱ్ఱలాలింపవే, రూపు జూపింపవే, సౌఖ్య మొందింపవే, బాధదప్పింపవే, బాప దుఃఖంబులుం బాపవే, న్యాయమా కోర్కె లీడేర్పవే, నీతిగా నుంపవే, సద్బుద్ధు లూహింపగా జేయవే, యక్కరల్ గూర్పవే, సత్కృపావీక్షణంబుల్ ప్రసాదింపవే, కావవే, దేవ కాపాడవే, తండ్రియే మేమివాంఛింపగాఁ గూడునో, దేనిఁ గాంక్షింపగా

మ. మును నే మ్రొక్కిన మ్రొక్కుదీర్ప శతకంబున్ బూర్తి గావించితిన్
జననం బందినదాదిగా నిను మనస్నా సేవలన్ జేయుచున్
నిను నే నిత్యము సంస్మరించుదును తండ్రీ నీగుణాతీశతన్
మన మందున్ శుభదృష్టి జూతు సుఖధామా కాశివిశ్వేశ్వరా. 99

మ. ఘన చిత్తంబున నీ కొసంగితిని, నీ కారుణ్యము న్గోరి పా
వనుఁడార్యోత్తముఁడా ప్రయాగగురునాథాఖ్యార్య శిష్యుండ ను
ర్వినివి నే వంగల వారివంశజుడనై శ్రీ వేంకటారత్నమా
టను, నీవీ శతకంబు గైకొనుము, దేవా కాశివిశ్వేశ్వరా! 100

శా. శ్రీ వత్సాఖ్యసుగోత్రసంభవుడనై శ్రీ భాగ్యమే తల్లియై
సావంతుం డగు రామయాఖ్యుడును తండ్రై, యొప్పెడున్ నీదు సే
వావాత్సల్యత, జేసితిన్, శతక మాహ్లాదంబుతో జూచినన్
నా వాంఛితమ్ము దీర్పగా గదవె, దేవా, శ్రీకాశి విశ్వేశ్వరా. 101

సంపూర్ణము.

# దండకము



శ్రీ మన్మహాదేవ దేవ దేవా, సర్వలోకౌఘ, శ్రీ ముక్తి సంధాయకా, మహానైర్భీమా, మహాభక్త కల్పద్రుమా, సచ్చిదానందమూర్తీ, మహానిర్మలా, నిశ్చలా, మహావిభ్రమాసక్తిఖేల, ప్రీతితో శ్రద్ధతో, ప్రేమతో, నన్నాలించి రక్షించుతన్, నన్నునుంజేర్చి, నాతాపమీక్షింపవే, భక్తిబోధింపవే, మొఱ్ఱలాలింపవే, రూపు జూపింపవే, సౌఖ్యమొందింపవే, బాధదప్పింపవే, బాప దుఃఖంబులుం బాపవే, న్యాయమౌ కోర్కె లీడేర్పవే, నీతిగా నుంపవే, సద్బుద్ధు లూహింపగా జేయవే, యక్కరల్ గూర్పవే, సత్కృపావీక్షణంబుల్ ప్రసాదింపవే, కావవే, దేవ కాపాడవే, తండ్రియే మేమివాంఛింపగాఁ గూడునో, దేనిఁ గాంక్షింపగా

గూడదో, దెల్పవే, సత్సంతతుల్, యిచ్చి సౌఖ్యంబుఁ జేకూర్పవే చర్యలుఁ, జేష్టలుఁ, ముద్దులుఁ, సర్వముఁ నాకు నీతోనె విశ్వాత్మకా విశ్వసంరక్షకా, దాససంప్రీతి సంధాయకా, దైవచూడామణీ, యార్త రక్షామణీ, భక్తచింతామణీ, ఘోరసంసార దుర్లంఘ్యపూర్ణాబ్ధి సద్యాన పాత్రా, మహాస్తోత్రపాత్రా, మహాపాపవల్లీలవిత్రా, వేదసంవ్యక్తసజ్యోతిరాకార, సర్వేశ్వరా, కాశివిశ్వేశ్వరా, యీశ్వరా, శంకరా, పావనా, దయాపూర్ణసింధో, స్వరాడ్దివ్యరూపా, విరాడ్భూజ్యరూపా, మహాదేవ శంభో, మహాదేవశంభో, నమస్తే నమస్తే నమస్తే నమః.



శ్రీరస్తు.

# శ్రీ కాశీవిశ్వేశ్వర శతకమునకు

## ప్రధాన రాజపోషకులు

మ. రా. శ్రీ శ్రీ కలిదిండి శివరామరాజుగారు, పాలమూరు.
,, శ్రీ కొత్తపల్లి శారదాంబగారు, పాలమూరు.

## రాజపోషకులు

మ. రా. శ్రీ శ్రీ కలిదిండి బలరామరాజుగారు, పాలమూరు.

## పోషకులు

మ. రా. శ్రీ శ్రీ మండ గురునాథముగారు, వేల్పూరు.

## సహాయులు

శ్రీ శ్రీ కలిదిండి వెంకట నరసింహరాజుగారు, పాలమూరు.

శ్రీ వంగల శ్రీరామమూర్తిగారు, టీచరు ,,

శ్రీ కలిదిండి సూర్యనారాయణరాజుగారు, ,,

శ్రీ యాళ్ళబండి రాజశేఖరంగారు, ,,

శ్రీ యామిజాల లక్ష్మీనరసింహమూర్తిగారు, ,,

శ్రీ కలిదిండి భీమరాజుగారు, ,,

శ్రీ బొక్కా శ్రీరామశాస్త్రిగారు, తెలుగు టీచరు, అత్తిలి.

శ్రీ బోడపాటి వెంకట కృష్ణయ్య నాయుడుగారు, రిటైర్డు పి. డబ్లియు హెడ్డ్ క్లర్కు, కొవ్వూరు.

శ్రీ మలకా వీరాస్వామిగారు, పాలమూరు.

# చందాదారులు

శ్రీ శ్రీ ఆచంట వీరరాఘవరావుగారు, టీచరు, పాలమూరు.

శ్రీ దొమ్మేటి సూర్యనారాయణగారు, టీచరు, పాలమూరు.

శ్రీ యస్. యస్. జి.వి.యస్ ఆఛారిగారు, టీచరు, పాలమూరు.

శ్రీ నారణాశి వెం[illegible]గారు, టీచరు, పాలమూరు.

శ్రీ బుద్ధరాజు రామచంద్రరాజుగారు, పాలమూరు.

శ్రీ కలిదిండి నీలయ్యగారు, పాలమూరు.

శ్రీ సుందర సత్యనారాయణగారు, పాలమూరు.

శ్రీ సుందర నారాయణమూర్తిగారు, పాలమూరు.

శ్రీ కలిదిండి రామరాజుగారు, పాలమూరు.

శ్రీ దండ వెంకట కృష్ణంరాజుగారు, పాలమూరు.

శ్రీ కలిదిండి పట్టాభిరామచంద్ర రాజుగారు, పాలమూరు.
శ్రీ కలిదిండి రాయపరాజుగారు, పాలమూరు.
శ్రీ బండీ సుబ్బారావుగారు, అత్తిలి.
శ్రీ యడవిల్లి వెంకయ్యగారు, అత్తిలి.
శ్రీ కలిదిండి బుచ్చిరాజుగారు, పాలమూరు.
శ్రీ సుందర కొండయ్యగారు, పాలమూరు.



